నమః పరమ ఋషిభ్యః.

ఆత్మసంగ్రహము        నం ౯.

సకలపురుషార్థంబులకును మంచితెలివి సాధనము- మంచితెలివి సంపాదించికొనువాఁడు తన్ను నితరవస్తువులను నెఱుంగవలయును- తన్ను నెఱుంగనిచో నితరములనెట్లు దెలిసికొనంజాలును- తన్నుం దాననియు నేననియు నెఱుఁగనివాఁడు లేఁడుగాని తానిట్టివాఁడని లెస్సగాఁ దెలియుట విమర్శింపక సాధ్యము గాదు- శరీరమే తానని పామరులు భ్రమించుచున్నారు- కావుననే తనశరీరముపైనెక్కఁడు గొట్టినచోఁ దానువాని చేతఁ గొట్టఁబడెననుకొనుచున్నాడు ఈ భ్రాంతి పండితులకు నైతము పుట్టుచున్నదిగాని వారలకు విమర్శనుసనది పరిహృతంబైనను పూర్వవాసనావశంబున నాపాతప్రాప్తంబై వెండియు విమర్శబలంబున నివృత్తమగుచుండును- పామరులు విమర్శహీనులు గావుననది దృఢంబైయుండును- కొందఱువిమర్శించియు జన్మాంతరపాపవశంబున విపరీతజ్ఞానబలాత్కారవశంవదులగుదురు- వారు నాస్తికులలోనగ్రేసరులు విశేషించి చార్వాకులనియు లౌకాయతికులనియుం జెప్పంబడుదురు- వారలు పండితుని నైతముగ

లించుటకు యత్నము సేయుదురు- కాఁబట్టి తన్నువి మర్శించుట బుద్ధిమంతునకు నావశ్యకము. తానన్న వాఁడే నేనన్నవాఁడు- వాఁడేయాత్మ. వాఁడే చేతనుఁడు-

శరీరమే యాత్మ యనుటమోసము- శరీరమనేకావయవముల ప్రోవని యందఱు నెఱుఁగుదురు ఇన్ని యవయవంబులును వేఱువేఱు నాత్మలగుచో నొక్కొక్క శరీరములలో ననేకాత్మలు గలుగవలసివచ్చును. పరస్పరవివాదము ప్రసక్తమగును- ఇందులో నొక్క యవయవమే యాత్మయగుచో నట్టి యవయవంబునకుపఘాతము గలుగుచోఁ జైతన్యము నశింపవలసి వచ్చును- సర్వశరీరమును వ్యాపించుసుఖదుఃఖానుభవంబులకనుపపత్తి గలుగును- అవయవంబులందక్క నవయవియనునది యొక్కటివేఱుగాఁ గానరాదు. ఇంతియగాదు నాశరీరమని తనకును శరీరంబునకును భేదవ్యవహారము సర్వానుభవసిద్ధము- అట్లే నాయాత్మ యనియు వ్యవహారముగలదేయని శంకింతురు- లెస్సగా విమర్శించినచో నాశంకగలుగదు- ఆత్మశబ్దము సంస్కృతభాషలో శరీరాన్తఃకరణస్వరూపాద్యనేకార్థములం

జెప్పుచున్నది- గాన నాయాత్మ యనఁ బోఁదన శరీరము
ని యొండెం దనయంతఃకరణమని యొండెం దనస్వ
రూపమని యొండెం దలంచుటం గలిగిన వ్యవహారము
గాని తనకంటెం దాను వేఱనుతలంపునం గాదు- అ
ట్లైనచో నా దేనని తెలుఁగున వ్యవహారముం గలు
గవలసివచ్చును.

అట్లైన నింద్రియంబు లాత్మ యనుదమంటి
రేని మున్నవలె నొక్క శరీరమున ననేకాత్మలుఁడ
వలసివచ్చును- మఱియు నేనిది చూచితి నిది ముట్టితిన
ని తెలివి గలుగుచున్నది- చూచుట చక్షురిన్ద్రియ
మునకును- ముట్టుట త్వగింద్రియమునకుం బనులు-
రెండు నొక్కఁడు చేసినట్లెట్లు తెలియవచ్చును- ఇం
తియు గాక మున్ను కన్ను గలవానికి దురదృష్టవశంబు
న నది నశించును- వాఁడు మున్ను దాఁ జూచినదాని
స్మరించుటయుం గలదు- ఇంద్రియములే యాత్మల
యినచోఁ జూచిన యాత్మ నశించెంగదా- అది తలం
చువాఁ డెవ్వఁడు.

ఐనఁ దంతఃకరణం బొక్కటి గలదు అదియన్ని
శనులకుం బాధ్యగాన నదియాత్మ యనవచ్చునను
శంకతోఁచును- ఒక్కపనికిం గర్తయుఁ గరణంబునే

ము గానుండుటఁ జూచున్నాము- స్మరణాదికార్యము లకు నంతఃకరణము కర్తయయినచో నంతఃకరణం బెయ్యది.

ప్రాణమాత్మయనరాదు- అది యొక్కగాలి. అదియుచ్ఛ్వాస నిశ్వాసంబులచే లోనికి వెలికిని నడచుచున్నది- అట్లు నడచు నూర్పును దన చేతిమీఁదికి నడపి స్పర్శబలంబుననిది నాప్రాణమని తెలిసికొనువాఁడు ప్రాణమెట్లగును.

తెలివి యాత్మయనం బోవరు- చూచుట వినుట ముట్టుట యనియిట్లు తెలువు లనేకములు- అవి క్షణభేదంబుల ననేకంబులగుచున్నవి- అట్టియస్థిరంబులు స్థిరములుగాఁ గానవచ్చుచున్న తానెట్లగును.

నా మేను నాకన్ను నాచెవి | నామనము నా యూర్పు నా తెలివి యనియిట్లు స్పష్టముగా భేదముగాఁ దెలియుటయు నివియొక్కప్పుడు తోచి యొక్కప్పుడు దోచకుండుటయును- ఆత్మ యెల్లప్పుడుం దోచుటయును- దేహేంద్రియాది వ్యతిరిక్తాత్మ సాధకములు.

ఇన్నియునట్లుండనీ- పంచవింశ ఆత్మేత్యాది శ్రుతులును దదనుసారములగు స్మృతిపురాణాదివచనం

బులనుముఖ్యసాధకంబులు. *

ఇట్టియాత్మస్వయం ప్రకాశుండు- కావున నేయజడుండనంబడును- తన్నుఁదెలిసికొనఁబోవ నిత రొక్కటిదాని యక్కఱ లేకుండ నే తనంతనే తెలి యుటస్వయంప్రకాశత్వము- ఇతరవస్తువులు దెలి యఁబోవెలుఁగుగావలయును- వెలుఁగుండెలియు టకు మఱియొక్కవెలుఁగుండ వలయునే- అట్టిదే యాత్మస్వరూపము- హృద్యన్తర్జ్యోతిరిత్యాది శ్రుతు లును- ఆత్మజ్ఞానమయోఽమల ఇత్యాది వచనంబు లుంగూడనిందుఁబ్రమాణములు.

ఆత్మయానందమయుండునగును- అనుభూ లమానందము. తనకుందానసుఖాలుండగుటయాత్మ సాక్షికము- నిద్రించిలేచువాఁడు- సుఖముగా ని ద్రించితినని కొనుటయు నిందుకుపష్టంభకము. ఆ

* హితాహితానామ నాడ్యస్తాసాం మధ్యే శశిప్రభ మ్। మణ్డలంతస్య మధ్యస్థ ఆత్మాదీపఇవాచలః॥ యాజ్ఞవల్క్య స్మృ. ౧౦౫ శ్లో.
పిణ్డః పృథగ్యతః పుంసశ్శిరః పాణ్యాదిలక్షణః। తతో హమితికుత్రైతాం సంజ్ఞాం రాజన్ కరోమ్యహమ్॥ వి ష్ణు. ౨ అ. ౧౩ అ.

ర్దర్శిం జ్వలతీత్యాదిశ్రుతులును నిర్వాణమయ ఏవాయమాత్మేత్యాది వచనంబులు నే తదనుకూలములు.

అట్టియాత్మనిత్యుండుగాని పుట్టువాఁడొండె నశించువాఁడొండెం గాఁడు- ఈశ్వరుండు ప్రజలను సృజించె వెండియుం జంపునను వాక్యములకుం గరణకళేబరములతోఁ గూర్చుననియు నందుండి వెడలించెననుటయు నర్థము- అట్లుగాకనుత్పన్న లేకుండి క్రొత్తగాఁ బుట్టినచో నశించుట ప్రసక్తమగును- స్వర్గనరకమోక్షాదివాక్యములుం గల్లయగును- నిత్యోనిత్యానామిత్యాదిశ్రుతులును నజాయతే మ్రియత ఇత్యాదిశ్రుతులు నందుకుఁ బ్రమాణములు- ఇట్టియాత్మకు జన్మాంతరంబు లనేకంబులు గలవనునది జన్మసంగ్రహమునం దెలుపంబడినది.

ఇతఁడణుస్వరూపుఁడై హృదయప్రదేశమునను ండునని యేషోణురాత్మేత్యాది శ్రుతులును- హృదిహ్యేవేత్యాదిశ్రుతులును దెలుపుచున్నవి- ఏనను దీపము కొంచోనుండియుం దనవెలుఁగున నింటినెల్ల వ్యాపించినట్లు తనజ్ఞానంబున శరీరంబునెల్ల వ్యాపించి యచ్చటి సుఖదుఃఖంబుల ననుభవించుచుండునని బ్రహ్మసూత్రప్రసిద్ధము.

ఆత్మ దేహపరిమాణుండని యార్హతమత
ము- అదిశ్రుతివిరుద్ధమగుటస్పష్టము- పెద్దశరీరము
విడిచి చిన్నశరీరములోఁ జొచ్చునప్పు డాత్మకు శైధి
ల్యము రావలసియుండును.

ఈయాత్మ చక్షురాదీంద్రియంబులం గానరాఁ
డు గావున నవ్యక్తుండనియు మనము చూచు వస్తువుల
పోలికం దలప రాఁడు గాన నచింత్యుఁడనియు జ్ఞానైకా
కారుండు గావున. నిరవయవుండనియు- ఛేదనక్లేద
నదహనశోషణంబులకుం దగఁడు గావున వికారంబులు
లేమి నిర్వికారుండనియుం జెప్పంబడును.

ఆత్మ పరిశుద్ధుండయ్యు నవిద్యాసంబంధంబు
నఁ దత్పరవశుండగుచు నానందమయం బగు తన
స్వరూపంబెఱుంగక దేహాత్మభ్రమంబను నహంకా
రంబును దేహసంబంధులయందలి మమకారంబునను
మిథ్యాజ్ఞానంబున దేహపోషణాద్యనుకూలంబులగు న
న్నపానాదులవలనం గలుగు సుఖంబె సహజసుఖం
బుగాఁ దలంచి దానియందలి రాగంబునం దత్సాధన
సంపాదనేచ్ఛ గలిగివానిం గైకొనం బ్రవర్తిలుచో వ
చ్చు ప్రతిబంధంబుల ద్వేషంబు గలిగి తత్సాధకులయం
దుం గోపించి యిట్లు రాగద్వేషవశంవదుండగుచుం

పుణ్యపాపంబులం జేయుచుం దానివలన స్వర్గనరక
ములననుభవింపుచుం దచ్ఛేషంబులతో జన్మాంతరం
బులం జెందుచు నిట్లిడుములం బడుచున్నాఁడు.

ఇట్లు సుఖదుఃఖంబులయందను దత్సాధనం
బులని తలంపంబడినవాని యందును రాగద్వేషంబు
లు ప్రవృత్తి నివృత్తులకుం గారణములు పుట్టిన వా
నికి వెంటనే తత్సాధనంబునం బ్రవర్తిలుటకుం బూ
ర్వజన్మవాసనాప్రయుక్త రాగంబె కారణము.

ఇట్లు తన ప్రవృత్తి నివృత్తులు రాగద్వేషాధీనం
బులని యెఱింగి తత్తుల్యములగు నితరశరీర ప్రవృత్తి
నివృత్తులచేతం దత్కారణములగు రాగద్వేషంబుల
నూహించి తదాశ్రయుండగు నాత్మ నూహింపవ
చ్చును కావుననే క్రిమికీట పక్షిమృగాది శరీరంబుల
యందున్నాత్మలున్నారని యెఱుంగునది- అయి
నను వానియందు జన్మాంతర పుణ్యపాపకర్మ తార
తమ్యానుకూలోపకరణ తారతమ్యప్రయుక్త జ్ఞాన సం
కోచవికాసతారతమ్యంబులు గలవు.

అట్లు నర వానర కుంజర పశుపక్ష్యాదులయం
దు జ్ఞాన తారతమ్యంబులున్నట్లు మనకనుభవసిద్ధము-
అన్ని ప్రాణులకంటెను మనుష్యునకు జ్ఞానోపకర

ణసామగ్రియధికంబుగానున్నది- ఇందువలనంగొం
దఱుమనుష్య శరీరంబులయందే యాత్మలు గలరు
తక్కిన శరీరంబులయందు విజాతీయములయిన
వస్తు విశేషంబులున్నవి గాని యాత్మలు లేరనియ
నుకొనుచున్నారు- అందుకు సాధకములగు ప్రబల
యుక్తులు గానరావు- ఈశ్వరునిం దెలియందగిన
తెలివి లేదు గాన నందాత్మలు లేరనియందురు- అందు
నది యెట్లు సాధకంబగును- వానికట్టి తెలివి లేదనియ
యినను మనకెట్లు తెలిసినది- ఆవిదెలుపువారి మాట
లు వినుటకును తమకుం దెలిసినదానిం జెప్పుటకును
నుపకరణంబులు లేకున్నమాత్రనే యట్లు సెప్పినచో బ
ధిరమూక శరీరంబులయందును బాల్యవృద్ధ శరీరం
బులయందు నాత్మలు లేరనవచ్చునే- అవియట్లుండ
నీ- జన్మాంతరీయకర్మవశంబున నాత్మలకు మనుష్య
శ్వసూకరాదియోనులు సంభవించునట్లు రమణీయ
చరణా ఇత్యాదిశ్రుతులు సెప్పుచున్నవి- తదనుసారు
లగు స్మృతిపురాణ వచనంబులు వృక్షలతాగుల్మాదుల
యందుసైతమాత్మలున్నట్లు సెప్పుచున్నవి *

---

* శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః। వా
చికైః పక్షిమృగతాం మానసైరన్త్యజాతితామ్. మను.

ఈయాత్మలందఱును జీవులనంబడుచున్నారు- ఇందఱు నవిద్యాబద్ధులు- వీరలు సంసారులనియు నుబద్ధులనియుం జెప్పంబడుచున్నారు- వీరుబుభుక్షువులును ముముక్షువులునని రెండు తెగలవారు- ఐహికంబొండె నాముష్మికంబొండె భోగముంగోరువారలుబుభుక్షువులు- భోగమనంగా సుఖదుఃఖానుభవము- ఇట్టిసాంసారిక సుఖంబులు తుచ్ఛములని

---

౧౨ అ. ౯ శ్లో

అవిద్యాకర్మసంజ్ఞాన్యాతృతీయాశక్తిరిష్యతే। యయాక్షేత్రజ్ఞశక్తిస్సావేష్టితానృపసర్వగా। సంసారతాపానఖిలానవాప్నోత్యతి సంతతాన్। తయాతిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా। సర్వభూతేషుభూపాల తారతమ్యేన వర్తతే। అప్రాణవత్సుస్వల్పాసా స్థావరేషుతతోధికా। సరీసృపేషు తేభ్యోప్యతి శక్త్యాపతత్రిషు। పతత్రిభ్యో మృగాస్తేభ్యస్తచ్ఛక్త్యా పశవోఽధికాః। పశుభ్యోమనుజాశ్చాపిశక్త్యాపుంసః ప్రభావితాః। తేభ్యోపినాగగంధర్వయక్షాద్యా దేవతానృప। శక్రస్సమస్త దేవేభ్యస్తతశ్చాపి ప్రజాపతిః। హిరణ్యగర్భోపి తతః పుంసశ్శక్త్యుపలక్షితః॥ విష్ణు. ౬ అం. ౭ అ.

మెఱిఁగిదుఃఖ లేశంబునోర్వ యనియఖణ్డానంద స్వ
గావిర్భావ రూపంబగుముక్తిం జెందంగోరితత్సా
నాభ్యాసమును జేయువారు ముముక్షువులు- అట్టి
బహుజన్మకృత సాధనాభ్యాసంబున సిద్ధులగు
ముక్తిం జెందినవారేని ముక్తులనంబడుదురు.

జీవస్వరూపములన్నియు నేకవిధంబులై యు
కర్మతారతమ్యాధీనోపాధికృతజ్ఞానసంకోచభేదం
న సంసారదశన న్యోన్య విలక్షణములు గానుండు
శంకర రామానుజమతములు- అట్లుగాదు- జీవ
స్వరూపంబులు సహజముగానే భిన్నములయి యుం
నెట్లనిన- ముక్తియోగ్యులు నిత్యసంసారులు త
మోయోగ్యులని జీవులు మూడు తెగలవారు అందు
ముక్తియోగ్యులు దేవఋషిపితృ చక్రవర్తి మనుష్య
భేదంబున నైదు విధంబులనుందురు- నిత్యసంసా
రులెప్పుడును స్వర్గ భూ నరకంబుల భ్రిమ్మరుచుందు
తమోయోగ్యులు నిత్యతమః స్థానమునుం జెందంద
వారు- మృగపక్షిమనుష్యాది సంస్థానభేదంబులు
రూపంబులయందే యుండునని మధ్వమతము.

ఈ జీవులను నేతద్బంధక దోషములను గూడ
కొనిన స్వతంత్రుండై నిర్దోషుండై యపరిచ్ఛిన్నం

డయియుండునాత్మయొక్కఁడుగలఁడు- అతండే పర
మాత్మయనంబడును- అతండె బ్రహ్మంబనియుం బరబ్ర
హ్మంబనియు నీశ్వరుండని యుం జెప్పంబడును- వాని
స్వరూపమీశ్వర సంగ్రహమునం దెలుపఁబడును.

జీవులు తదంశంబులేయని భగవద్గీతా బ్రహ్మ
సూత్రాది ప్రసిద్ధము- అంశమనఁగా నిట్టిదని వివరిం
చునెడ నే మతభేదంబులు గల్గినవానిఁ దెల్పుటయిం
దత్యావశ్యకంబుగాదు- జీవులు తత్ప్రతిబింబంబుల
నియుం శంకర మధ్వమతంబులు.

శంకరీయులలో నేక జీవవాదంబు ననేక జీవ
వాదంబునని రెండు పక్షములు గలవు- ప్రథమపక్షము
న జీవుండవిద్యాప్రతిబింబము- రెండవపక్షమునం
తఃకరణ ప్రతిబింబము- అవిద్యయనఁగా నాత్మస్వరూ
పావరణంబగు నొక్క వస్తువు- అదియజ్ఞానంబనియు
నండ్రు- అవిద్యాభాగపరిణామ విశేషంబులంతఃకర
ణంబులు- బ్రహ్మాత్మైక్యజ్ఞానంబున నవిద్యానివృత్తియ
గుచో ముక్తి గలుగునని యుభయపక్షములవారలును
డ్రు-. అందుఁ బ్రథమపక్షమున నొక్కనికిం దత్త్వజ్ఞా
నము గల్గుచో సర్వముక్తిప్రసంగంబు వచ్చును- గాన
రెండవపక్షంబే బహుసమ్మతము. రెండవపక్షము

నంశను జీవభేదంబున నవిద్యల నేకంబులని కొందఱ భిమతము - అవిద్య యొక్కండే యయ్యును దాని యావరణశక్తులు జీవభేదంబున ననేకంబులు గాన నొక్కొక్క యావరణశక్తి నశించుచో నొక్కొక్క జీవునకు ముక్తి గలుగునని కొందఱభిమతము.

సంసారి జీవులలో సత్కర్మ విశేషానుష్ఠానంబులు సేసినవారలు దేహావసానంబున ధూమాదిమార్గమునం బుణ్యలోకంబులం జెంది సుకృతభోగావసానంబునం గర్మశేషంబులతో నాకాశవాయుధూమాభ్రమేఘ వర్షణంబులం జెంది యోషధులం జేరి సన్నపరిణామ పర్యన్తము గానుండి యన్నముఖంబునం బురుష శరీరంబుం జెంది శుక్రముతోం జేరి స్త్రీగర్భంబుం జెంది సశరీరులయి కర్మతారతమ్యమునం బట్టియుత్తమాధమజన్మములం జెందుదురు.

నిషిద్ధకర్మవిశేషంబులం జేసినవారలు యమశాసనంబున రౌరవాది నరకవిశేషంబులం జెందిదుఃఖానుభవావసానంబునం గర్మశేషంబునం దిర్యగాదిజన్మంబుల నెత్తుదురు.

బ్రహ్మవిద్యానిష్ఠులర్చిరాది మార్గంబున మోక్షస్థానముం జెందుదురని రామానుజమతము - సగు

ణ బ్రహ్మోపాసకుల ర్చిరాది మార్గంబున బ్రహ్మలో
కమును జేరి యచ్చటనే క్రమంబున నిర్గుణ బ్రహ్మసా
క్షాత్కారమును జెందిముక్తిం జెందుదురనియు నిచ్చట
నే తత్త్వమసీత్యాది వాక్యశ్రవణాది క్రమంబున బ్రహ్మ
సాక్షాత్కారమును జెందువారలు ముక్తిం జెందుదుర
నియు శంకరమతము- బ్రహ్మసాక్షాత్కారంబునం గ
ర్మక్షయంబును తాత్క్రిస్తియు నర్చిరాది మార్గగమ
నంబును శేషగరుడమార్గంబుల దేహాలయంబును భో
గంబను ముక్తియు వరుసం గలుగుననియు దేవజీవు
లకును తాత్క్రిస్తియు నర్చిరాది గమనంబును లేక దే
హాలయ భోగంబులు గలుగుననియు మధ్వమతము.

ధూమరాత్రికృష్ణపక్ష దక్షిణాయన నామం
బులుగల లోకంబులత్రోవ ధూమాదిమార్గము- అ
ర్చిరహశ్శుక్లపక్షోత్తరాయణ నామంబులు గలలోక
ములత్రోవయర్చిరాదిమార్గము- అర్చిరాది మార్గం
బును శేషగరుడ మార్గ దేహాలయాదులును ముక్తిసం
గ్రహంబున వివరింపంబడును.

బద్ధముక్తులే కాకయస్పృష్టసంసార గంధుల
గు నిత్యసూరులను జీవులుంగలరని రామానుజమతము.

బద్ధజీవులకు- జాగ్రత్స్వప్న సుషుప్తి మరణ

మూర్ఛలనునవస్థావిశేషంబులుగలవు- జ్ఞానికిం దురీయావస్థయను నవస్థాంతరంబుంగలదండ్రు.

ఇందు బాహ్యేంద్రియవ్యాపారంబులం దెలివిం జెందియుండు నవస్థజాగ్రదవస్థ- అందు నింద్రియద్వారంబున నంతఃకరణము వెడలి బాహ్యపదార్థంబులపైంబడి తదాకారంబునంబరిణమించు నప్పరిణామంబె వృత్తియనంబడునది యగు దానితోంగూడియున్న చైతన్యంబును ప్రత్యక్షజ్ఞానం బనంబడుననియు నట్లంతఃకరణంబు వెలికి రాకయొతత్తత్పదార్థాకారంబునం బరిణమించినం బరోక్షజ్ఞానంబగుననియు శాంకరియమతము.

ఆత్మమనస్సంయోగంబు నింద్రియమనస్సంయోగంబు నింద్రియార్థసంయోగంబును వరుసం బుట్టిన నంతఃకరణంబులోనే యుండి జ్ఞానాకారంబునంబరిణమించునట్టిజ్ఞానమునకునర్థంబువిషయంబగునిట్టియయని మధ్వమతము.

దీపాది తేజోవస్తువులకు స్వరూపాతిరిక్తంబగువెలుంగను పదార్థంబు గలిగినట్లాత్మకు ధర్మభూతజ్ఞానంబనునదియొక్కటిగలదు- దాని యవస్థావిశేషంబె తెలివియనంబడు నింద్రియార్థసంయోగ

మానసంగలిగిన యదియె ప్రత్యక్షంబనంబడునని రామానుజమతము.

బాహ్యేంద్రియవ్యాపారంబులు లేకయే విషయంబుల బ్రత్యక్షీకరించు తెలివి స్వప్నావస్థ- అస్వప్నదు గానంబడు గజాదిపదార్థంబులు మాయాపరిణామంబులని శంకరమతము- ఈశ్వరుని తాత్కాలికాశ్చర్యసృష్టియని రామానుజమతము ఈశ్వరుండు చేయువాసనాసృష్టియని మధ్వమతము.

బాహ్యేంద్రియాంతఃకరణ వ్యాపార విరామంబు సుషుప్తి- అదియెనిద్ర- అప్పుడవిద్యావృత్తి గలదని శంకరీయమతము- అప్పుడు జీవుండు నాడీపురీతన్మధ్యగత బ్రహ్మాగతుండగును.

జీవుండొక్క దేహము విడిచి మఱియొక్క దేహముం జెందునప్పుడు సభూతసూక్ష్మంబులు నింద్రియంబులును సూక్ష్మశరీరను విడువకయే యుండును- అదియె లింగశరీరంబనియునంద్రము.

ఇది శ్రీ పరవస్తు వేంకటరంగాచార్య

లయ్యవారలుంగారిచే రచియింపంబ

డిన యాత్మసంగ్రహము.

ప్రింటర్ అ॥ బ॥ శ్రీనివాసాచార్యులు. ౧౮౮౪ అక్టో॥